# ముందుమాట

1761 లో 3 వ పానిపట్టు యుద్ధముతో జాతీయోద్యమము దెబ్బ తిన్నది. మొగల్ ప్రాభవమునకు పునరుజ్జీవము కలుగ లేదు. మహారాష్ట్రులు కొంత పుంజుకొనిరి. కాని క్రొత్త పీష్వా మాధవరావు, మహామంత్రి నానా ఫర్నవీసులకు ఇల్లు దిద్దుకొనుటతోడనే సరిపోయి నది. వంగలో మీర్‌జాఫర్ వలెనే మహారాష్ట్రమున రఘునాధరావు సిద్ధమైనాడు. క్రొత్త నైజాము నిజామలీని త్రిప్పకొన జూచినాడు. కాని నానా ప్రభావముచే నతడు జాతీయోద్యమమున జేరెను.

వంగలో నందకుమారరాయ్, మీర్‌ఖాసిం, షా ఆలం కలిసి ద్రోహి మీర్జాఫరును తొలగించి, బ్రిటిష్ వారిని పారద్రోల జూచిరి. నానా గృహకల్లోలములు కారణముగా వారితో నెక్కుడు సహకరించ లేక పోయెను.

మీర్జాఫరు గెలిచినాడు. తన సైనిక బలము నంతను ఆంగ్లే యుల అధిపత్యమున బెట్టి. సముద్రతీర అసుర వృద్ధుని వలెనే వారెక్కిన భుజములు దిగలేదు. సరికదా ఊరుపోయియు, పేరు మిగిలిన పాదుషాను కామినీ, కాంచన, పానవశుని జేసి వంగ దివానీని సంపాదించిరి. అదియే రాగల నిశాచర యుగమునకు అసుర సంధ్యయైనది.

ప్రకాశకులు

# విషయసూచిక

# చేతులు కాలిన తరువాత ఆకులు...

శ్రీ సింగును గౌగిలించు కొనినాడు యోగిరాజు. 'నీ విచ్చు నీ యభయముతో వేల యేండ్లుగా వదలక, పదేపదే పీడించుచు వచ్చుచున్న యొక్క మహద్భయము దీరినది. దేశమునకు వాయువ్యమున రక్ష కట్టబడినటే!' అనుచుం దిరిగి, తిరిగి కౌగిలించు కొనినాడు.

'హిందూసంఘములోనికి వర్ణవ్యవస్థనుం దెచ్చిపెట్టిన... మన రొమ్ములపై నొక కుంపటి నెత్తి, మన ప్రేవులలో నొక తంపటిగా నిలిచి పోయిన......ఆర్యుల దండ్లిటే వచ్చినవి. మత భేద రాక్షసి కూడ యిటు నుండియే వచ్చి, మనల నాశించినది. ఘజ్నీ, ఘోరీ లిటే వచ్చిరి. చెంగిజ్, తైమూరు, నాదిర్షా లిటే వచ్చిరి. మన దేవాదాయము లిటే నడిచి పోయినవి.మన నెమలి సింహాసన మిటే తఱలి పోయినది. ఇప్పటి కిది ఆరవసారి అహ్మద్షా దురానీ మన దేశముపై దండెత్తుట! అఫగణ స్థానము నుండి విసరుచున్న వాని గాలములకు మనఢిల్లీ, ఆగ్రా, మధుర లందలి భాగ్యరాసులు హెచ్చు తగిలి, వచ్చుట లేదట! అందుచే పంజాబు, కాశ్మీరులను దన పాద పీఠములు గావించు కొనునట! హూం ఊ----' అనుచు కుడిచేతిని జాడించి, కుంకుమం దెప్పించి శ్రీ సింగు ఫాలమున నుంచినాడు. 'ఇది దీక్షా తిలకము. దీనిని ధరింపజేయనిమ్ము' అనుచు నెడమచేత నతని శిరమును బట్టు కొని తిలకము నుంచి, కన్నార్పక చూడ సాగినాడు. ఆ చూపులో నేమున్నదో శ్రీసింగు కావేశము పెరిగినది.

# ముందుమాట

1761 లో 3 వ పానిపట్టు యుద్ధముతో జాతీయోద్యమము దెబ్బ తిన్నది. మొగల్ ప్రాభవమునకు పునరుజ్జీవము కలుగ లేదు. మహారాష్ట్రులు కొంత పుంజుకొనిరి. కాని క్రొత్త పీష్వా మాధవరావు, మహామంత్రి నానా ఫర్నవీసులకు ఇల్లు దిద్దుకొనుటతోడనే సరిపోయినది, వంగలో మీర్‌జాఫర్ వలెనే మహారాష్ట్రమున రఘునాధరావు సిద్ధమైనాడు. క్రొత్త నైజాము నిజామలీని త్రిప్పుకొన జూచినాడు. కాని నానా ప్రభావముచే నతడు జాతీయోద్యమమున జేరెను.

వంగలో నందకుమారరాయ్, మీర్‌ఖాసిం, షా ఆలం కలిసి ద్రోహి మీర్జాఫరును తొలగించి, బ్రిటిష్ వారిని పారద్రోల జూచిరి. నానా గృహకల్లోలములు కారణముగా వారితో నెక్కుడు సహకరించ లేక పోయెను.

మీర్జాఫరు గెలిచినాడు. తన సైనిక బలము నంతను ఆంగ్లేయుల ఆధిపత్యమున బెట్టి. సముద్రతీర అసుర వృద్ధుని వలెనే వారెక్కిన భుజములు దిగలేదు. సరికదా ఊరుపోయియు, పేరు మిగిలిన పాదుషాను కామినీ, కాంచన, పానవశునిజేసి వంగ దివానీని సంపాదించిరి. అదియే రాగల నిశాచర యుగమునకు అసుర సంధ్యయైనది.

ప్రకాశకులు

# విషయసూచిక

# చేతులు కాలిన తరువాత ఆకులు...

శ్రీ సింగునుఁ గౌగిలించు కొనినాడు యోగిరాజు. 'నీ విచ్చు నీ యభయముతో వేల యేండ్లుగా వదలక, పదేపదే పీడించుచు వచ్చుచున్న యొక్క మహద్భయము దీరినది. దేశమునకు వాయువ్యమున రక్ష కట్ట బడినటే!' అనుచుఁ దిరిగి, తిరిగి కౌగిలించు కొనినాడు.

'హిందూసంఘములోనికి వర్ణవ్యవస్థనుఁ దెచ్చి పెట్టిన... మన రొమ్ములపై నొక కుంపటి నెత్తి, మన ప్రేవులలో నొక తంపటిగా నిలిచి పోయిన......ఆర్యుల దండ్లిటే వచ్చినవి. మత భేద రాక్షసి కూడ యిటు నుండియే వచ్చి, మనల నాశించినది. ఘజ్నీ, ఘోరీ లిటే వచ్చిరి. చెంగిజ్, తైమూరు, నాదిర్షా లిటే వచ్చిరి. మన దేవాదాయము లిటే నడిచి పోయినవి.మన నెమలి సింహాసన మిటే తరలి పోయినది. ఇప్పటి కిది ఆరవసారి అహ్మద్షా దురానీ మన దేశముపై దండెత్తుట! అఫగణ స్థానము నుండి విసరుచున్న వాని గాలములకు మనఢిల్లీ, ఆగ్రా, మధుర లందలి భాగ్యరాసులు హెచ్చు తగిలి, వచ్చుట లేదట! అందుచే పంజాబు, కాశ్మీరులను దన పాద పీఠములు గావించు కొనునట! హూఁ ఊ----' అనుచు కుడిచేతిని జాడించి, కుంకుమఁ దెప్పించి శ్రీ సింగు ఫాలమున నుంచినాడు. 'ఇది దీక్షా తిలకము. దీనిని ధరింపజేయనిమ్ము' అనుచు నెడమచేత నతని శిరమును బట్టుకొని తిలకము నుంచి, కన్నార్పక చూడ సాగినాడు. ఆ చూపులో నేమున్నదో శ్రీసింగు కావేశము పెరిగినది.

జేవురించిన మొగముతో 'దీక్షయా యోగిరాజ్, ఇదిగో కత్తిరించని కబరి! సంకెలను స్ఫురింపజేయు కడియము! తలలో దువ్వెన! కాలికి లాగు! మొలలో కృపాణము!' అని, చఱ్ఱున బాకు నొర నుండి తీసి, దానితో ఫాలమున బొడుచుకొని 'ఇదిగో దీక్షా కుంకుమ యోగిరాజ్! ఇది రాలి పోదు!---ఈఎరుపు అరిపోదు! ఈగాయమును మాననీయము!అహ్మద్షా దురానీని సింధు దాటి రానీయము సరియా? జైగురుగోవింద్! జై 'ఖాల్సా'శిఖ్ రాజ్!

'నూటికి నూరు నాయుధ పాణులైన గణము మాది! మహారాజ్! అఫగణ వాహినులను పొంగి రానీయక, బ్రహ్మాండ మైన ఆనకట్టగా నిలిచెదము! అది మా వంతు. మీ రిక ఇతర దిక్కుల భద్రముఁ జేయించుడు' అని తన కత్తిని యోగి పుంగ వుని పాదముల యొద్ద నొకమాఱుంచెను. తిరిగి తీసికొని, తల కెత్తు కొనెను. ఒఱలో నుంచుకొనెను.

యోగి 'తప్పక శ్రీ సింగ్. పైదంతయు శివాజీ వారసు లగు మహారాష్ట్రుల వంతు. వారి జాతీయోద్యమ మిదియే కదా' అనెను.

పృథ్వీసింగు 'మా రాజసింహునితో మేవారు, భగవా న్దాసు, మాన్సింగులతో అంబరు, జస్వంతసింహాదులతో జోధపు రము, జయసింహునితో జయపురము, అభయసింహునితో మార్వా రు దుర్బలములై మా రాజపుత్ర జాతియే జీవచ్ఛవమై పోయినది. రెండు శతాబ్దములు శాంతి, భద్రతలు నిల్పిన మొగలు పతాక చినిగిపోవుటతో మా రాజపుత్ర స్థాన మొక కటకటాలు లేని మృగ శాలగా మాఱినది. నిర్వీర్యులైన మా రసపుత్ర వీరులు దోపిడి

మూకలకు జిక్కి, బలిపశువు లైరి. మా కిప్పుడు చరిత్ర తీరులు మాఱ్చుశక్తులు లేవు.

'అందుచేతనే ఇంకను మాలో మీసముపై జేయిపోవువార లమున్నచో, నేమహారాష్ట్రుల సేనావారములనో జేరుచున్నారము' అనెను.

చక్రవర్తిషాఆలం మాఱువేషములోనా వింతయోగి నను సరించుచు నున్న ట్లున్నాడు. 'మా మహమ్మదీయులలో సైనిక సామర్థ్యము తగ్గిపోవుటయే నేటి దౌర్భాగ్యమునకు ముఖ్య కారణ ము! క్రమశిక్షణ, సమచలనము తక్కువ! విలాసము, అలసత ఎక్కువ! ఉపకరణము లధికము, ఆహారము లల్పము! అక్బర్ షాజహాను తాతల యోగములు చూచిననే పిఱికిపందలును మహా వీరు లయ్యెడి వారందురు! నామ మాత్ర పాదుషాలమగు మమ్ము చూచిన మాతో చదరంగ మాడ బుద్ధి పొడమునేమొ?

'మా ప్రాభవ పతన మెప్పుడో మొదలిడినది. అఫగణ పారశీక వీరులు మా సామ్రాజ్యము నెప్పుడో చితుక కొట్టినారు. అయోధ్య, బెంగాలు, నైజాము నవాబులు తలకొక అంగము నూడ బెఱుకు కొనినారు! హిందూ, ముస్లిం ఏకీకరణోద్యమ మున నే, భారత జాతీయోద్యమమందే మోక్షము! మహారాష్ట్రులే ఎప్పటికైన భారత సామ్రాజ్య ఛత్రమును సరి చేయగల వీరవరులు!' అనెను.

ధనాజీ మహారాష్ట్ర యువకుడు. యుద్ధకాలమున కత్తి పట్టుకొని, కండకావరము లణచగలడు. శాంతి కాలములలో ఏక్ నాథ్, జ్ఞానేశ్వర్, తుకారాం ఆది కవిమహర్షులు రచించిన 'తమాషా' లనబడు వ్యంగ్యకథలఁ గాలక్షేపముఁ జేయుచుండును. 'దీన్ ఇలాహీ' సందేశమును దక్షిణమున కర్ణాటకము నుండి ఉత్త

రమున కాశ్మీరము వఱకు ప్రజలలో వ్యాపింప జేసిన ఇట్లలో నితని దొకటి. భారతజాతీ యోద్యమ మహాధ్వర హెూతలలో నొక డితడు.

ధనాజీ: 'వాయువ్య సరిహద్దును శిక్కులకు వదలినట్లు ఈశాన్యమును యువచక్రవర్తికి వదలుదము. ఆయన కక్కడెంతయో పలుకుబడియున్నది. వంగ రాజకియవేత్త నందకుమార రాయి సహకారమున్నదాయనకు. బర్ద్వాను, బీర్భూమి జమిందారులఅన్యోన్య వైషమ్యముల మాన్పించి, వారిని కూడ గట్టుకొనినారు. పాపం! వంగరాజధానిని జేరిరే కాని అంగ్లేయులకు సుఖనిద్రలేదు. ఏ వేళ పాదుషా వచ్చి, మీద పడునో యని సింహస్వప్నమయినది వారికి!'

పాఅలం: 'ఇప్పుడు నేనక్కడి నుండియే వచ్చునది! క్లైవుడు సేనాని పని యైపోయినది. కర్నల్ సేనానితో పాట్నాయొద్ద ఇప్పుడు పోరు జరుగుచున్నది. వాన్సిటార్టు నేత ప్రాణములు కడబట్టుచున్నవి. వర్తకమునకై వచ్చిన తమ కీ సామ్రాజ్యభారము లెందుకని గుండె కొట్టుకొనుచున్నాడు! తిఱిగి క్లైవునే వచ్చి,నిభాయించుకొనుమనుచున్నాడట!'

యోగిరాజు కావేశము పెఱిగినది. 'వీరితో డనే పెద భయము మనకు! ఇక్కడ బెంగాలు లోనే కాదు, అక్కడ మదరాసులో, బొంబాయిలో కూడ పాగాలు వేసికొని కూరుచున్నారు. మహారాష్ట్రుల కీ పానిపట్టు యుద్ధముతో నడుము విఱిగి నట్లయినది. యువ పీష్వా విశ్వాసరావు, ఉద్గిర్ విజేత సదాశివ రావు వంటి మహావీరు లస్తమించినారు. పంచ పాండవుల వంటి మహారాష్ట్ర నాయకులలో నైకమత్యము సెడినది. రఘునాథ

రావు కలిసి వచ్చుట లేదు. దురానీతో కలిసి చేటుఁ దెచ్చునని, దక్షిణాదికి పంపిరి, కాని అక్కడ క్రొత్త నైజాము నిజామలీతో గలిసి, యేమి చేటు దెచ్చునో? ఉద్గీర్ విజయ ఫలము చే జారి పోయినఁ బోవచ్చును.

'మహారాష్ట్రుల భయము లేనిచో హైదరలీ తిరిగి నియంత కావచ్చును. ఈసారి ఖండేరావు కూడ మైసూరు రాజు ఒడయరుకు సహాయపడ జాలడు. మొన్న వందవాసి యుద్ధమునఁ జావు దెబ్బ తినిన లాలీ---కాదు, పరాసువారు కోలుకొనుట కష్టమే! పాపము! డూప్లే, బుస్సీలు కట్టుకొనిన భవనము కూలి పోయినది.'

ధనాజీ: 'వారు వేసికొనిన పునాదులపై నాంగ్లేయులు నిర్మించుకొనరు కదా కొంపతీసి ...... సామ్రాజ్య భవనము?'

యోగి: 'అదియే యిప్పుడు వచ్చిన భయము! కర్ణాటకమున మహ్మదలీకి, బంగాళమున మీర్జాఫరుకు పట్టాభిషేకముఁ జేసి, ముకుత్రాళ్ళు చేత నుంచుకొనినారు. నైజాము, మైసూరులు గూడ వారి కాడి క్రిందికిఁ బోకుండచూడవలయును. అందఱును తలకొక చేయి చేసికొనిన గాని దేశ స్వాతంత్ర్యము నిలువదు. పాదుషావారుదీని కేమందురు?'

షాఆలం: 'ఏ మనుటకేముండును యోగిరాజ్? క్లైవుగారి గాడిదయగు మీర్జాఫరును దింపించి, గ్రుడ్డిలో మెల్లగా కొంత దేశ భక్తుడే యైన మీర్ఖాసిమును వంగపీఠి నెక్కించిన నాడే సగము విజయము లభించినది. ఆంగ్లేయులకు సామ్రాజ్య స్థాపనకుకాదు కదా, స్వేచ్ఛగా స్వంత వర్తకము జేసికొనుటకు గూడ అవకాశ మొసగడు. క్లైవు వచ్చి తిరిగి మీర్జాఫరు నెక్కించిన నేమ

గ్నో చెప్పలేను. కాని మీర్ఖాసిం ప్రభుత్వమే యింకను కొలది కాలము సాగినదో ... కంపెనీ వారికి బంగాళముననే గోరీ కట్టించెదను.'

ధనాజీ: 'ఔను యోగిరాజ్, పాదుషా జండా క్రిందనే వంగ నవాబు మీర్ఖాసిం, అయోధ్య నవాబు షుజాఉద్దౌలా కలిసి, దొంగ వర్తకము జేయుచున్న కలకత్తా వర్తక సమితి వారి పై కత్తి కట్టియున్నారు. పాట్నాతో మొదలిడి వేటాడి, తుడిచి వేయించెదను.

షాఆలం చేయి పట్టుకొని, కనులలోనికి జూచినాడు యోగిరాజు. 'జాగ్రత్త జహాపనా. శౌర్యమే కాదు, నేటి యోధుల లో నీతికూడ తగ్గినది. అయోధ్య నవాబును గ్రుడ్డిగా నమ్మకుడు. వీలున్నవఱకు కలకత్తా ధనముతో దక్షిణాది సేనలకు పుష్టి కలుగ కుండ చూడుడు. శెలవు. తిరిగి కలియుదము.' షాఆలం యోగి రాజుకు జోహారు గావించి, తూర్పునకు నడిచెను.

'పానిపట్టు మహాపజయముతో పీష్వా నిరాశుడై యుం డును. పూనా కేగి తదనంతర కార్య మాలోచింతుము లెండు' అని, యోగి దక్షిణోన్ముఖుడై బయలుదేఱి, 'ధనాజీ, విశ్వాస రావు ఆది మహారాష్ట్ర ముఖ్యుల మృత శరీరములు శత్రువులకు గాని ద్రోహులకు గాని అందనీయక, పూనా చేదునట్లు చూడుము' అనెను.

**16-1-1761.** నాటి సూర్యోదయము మొదలు సాయం త్రము 3 గంటల వఱకు జరిగిన మూడవ పానిపట్టు యుద్ధముతో భారతదేశ చరిత్రలో నొక మహాయుగమే అంతరించినది. హిందూ మహ్మదీయ సమైక్యత పేరుతో సాగిన జాతీయోద్యమము ఆఱగా రినది.

మున్ను ద్వాపరాంతమున కురుక్షేత్ర యుద్ధ మిక్కడనే జరిగినది. దానితో దేశమున క్షాత్రమే అస్తమించినది. ప్రాచీన యుగమంతరించినది.

పృధ్వీరాజు స్వీయులచేతనే మహ్మద్ ఘోరికి అప్పగింపబడి, సంహరించబడిన దిక్కడనే. దానితో దేశ చరిత్రలో హిందూ సువర్ణ యుగము అంతరించినది. అఫగణ తామ్ర మహా యుగ మారంభించినది.

లోడీని జంపి, బాబరు మొగల్ సామ్రాజ్యస్థాపన జేసినదియు నిక్కడనే. తుదకు హిందూరాజు హేమచంద్రుని జంపి, మెత్తని బంగారముతో కరకు రాగిని మేళవించినట్లు—పరస్పర సంపూరకములగు హిందూ, మహ్మదీయముల సమైక్యతను సంఘటించి, భారత జాతీయోద్యమ విధాతయై, అగ్బర్‌దీన్- ఇలాహీ ప్రవక్త యైన దిక్కడనే

అసుర సంధ్య అరంభమైనది. అస్తమయ సూర్యుని అరుణకాంతులు ఆకాశమును అలిమి వేసినవి. ఎఱ్ఱని మబ్బులు మాంసరాసుల వలె గోచరించు చున్నవి. దూర సరోవరము రక్తముతో నేర్పడినట్లున్నది. అసురు లదృశులై రాత్రి సంచారమునకు వచ్చిరి. వారి కనుకొనని పెం దారాత్రి. దేశీయోద్యమమును భూశయనము జేసి, జాతీయ వీరులకు సమాధి గట్టిన ఈ శ్మశానమున వారి కింక యథేచ్ఛ!

ఒక అర్ధ శతాబ్దముండు నీ సంధ్య. ఒక శతాబ్దము రాత్రియు దప్పదు తరువాత. అంతకాలము భారత స్వాతంత్ర్య భానుడు కనుచాటు పడక తప్పదు. కాని రాత్రి కాలముననే పగటి శ్రమ అపనయింప బడునుగదా. పగటి తప్పుల సవరణ కాలోచనలు జఱుగునుగదా. తిరిగి కలుగు సూర్యోదయముతో

జాతీయోద్యమము అకళంకమై, లోకాదర్శకమై ధగద్ధగీయ మానము గా గలదు లెండి. ప్రత్యేకముగా భారతీయుల ఆత్మకు కలుగగల యీ క్షోభకు, ఫలితముగా ప్రపంచమునకు సత్యాగ్రహ అహింసాయుధములు లభించ గలవు. వీరు భరించగల హాలాహలము ననుసరించి, విశ్వప్రయోజనకారి అమృతము సృష్టి యగును.

పరదురాక్రమణ భయ మేర్పడి నప్పుడు కాని జాతీయోద్యమము బల పడదు. కావున నీఅసుర సంధ్యకే కాదు, తదనంతరపు కాళరాత్రికినీ స్వాగతము. సంధ్యారుణిమ కే కాదు। రాత్రి కలుగు బానిసత్వ మహాంధ కారమునకును సుస్వాగతము, నక్కలకు, రాబందులకు, రక్కసులకును కూడ---

"'Tis the Sunset of life gives me mystical lore,
And coming events cast their shadows before"
—THE WIZARD TO LOCHIEL

ఆయుగ సంధి కాలమున ....
ఆదిన యామిని మధ్య సంధ్యలో ....
ఆయుగ జీవనాంత, మరణాది, తమోవృత రక్త సంధ్యలో ..
ఛాయక గోచరించెడిని భారత భావి కథా రహస్యముల్!
ఛాయల ముందె చూపు తమ చాడ్పు విలాస విధి విశేషముల్!

# గొడ్డళ్ళకి కట్టెలే పిళ్ళు

కీచులాలు స్వరము వేయు చున్నవి, గ్రుడ్ల గూబలు తాళము వేయుచున్నవి, పిశాచములు గాత్రము లెత్తినవి. – అశ్మశాన సంగీతమునకు శ్రోతలా వారు? కానిచో ఆ చిమ్మ చీకటిలో... గుబ్బములనానుకొని, నిలిచియున్న ఆ యిద్దరెవరో? దేనికో వారక్కడ చేరినది?...సహనశీల మగు నీ భారతవర్షమున వారి కెక్కడను చోటు దొరకలేదా! ఇతరు లెఱుగఁగూడని రహస్య మావారిది? దేశ మంతటిలో నే మానవుడును జూడఁగూడదా? వారి కలయిక దేశ మంతటికినీ భీతి గొలుపునది కాదుకదా? అంతటినీ ధ్వంసము జేయుగల యాగ మేమైన తలపెట్ట లేదుకదా కొంపదీసివారు? అయినను కేవల మిద్దఱు గూడి, ఆ సేతు శీతనగ విశాలమును, కోటానుకోటి జన సంకులము నగు నొక దేశము నేమో చేయుట యేమి?

దూది కొండంత యున్ననేమి? గోరంత నిప్పుచాలదా కాల్చివేయుటకు? వారెవరో సామాన్యులు గారు.

తూర్పు దిక్కు మొగమై నిలిచి యున్న... గడ్డము లేని ఆ వ్యక్తి రఘునాథరావు. పడమటి దెస మొగముగా నిలబడి యున్న...ఆ గడ్డపు వ్యక్తి నిజామలీ.

రఘునాథరావు మొదట వేసిన యెత్తు సాగియుండినచో పానిపట్టు యుద్ధము జరిగెడిదే కాదు. మీర్జాఫర్ క్లైవుగారి గాడిద యైనట్లు రఘునాథరావు అహ్మద్షా దురానీ గారిగాడిద యయ్యెడివాడు. దివాను రాయదుర్లభుని వలె హెూల్కారు వానికి తోడు గాడిద యయ్యెడివాడు. జగత్సేటులు, అమీన్చందులు గూడ

సిద్ధ మయ్యేడి వారెవరో ఆశీర్వదించుటకు! మొగల్ సామ్రాజ్యము పోయి అఫ్ఘన్ సామ్రాజ్యము దాపరించెడిది. నామమాత్ర సమ్రాట్టుగా షా ఆలం నే ఉంచినప్పటికినీ నిజాము కొడుకు ఘాజీ ఉద్దీన్ పోయి, అయోధ్య నవాబు షుజా ఉద్దౌలా ఢిల్లీకి వజీ రయ్యేడివాడు. తాను పూనాలోని పీష్వాకు, సతారా లోనిఛత్రపతికి, నైజాం, మైసూరు ఆది దక్కన్ నవాబులకు అధిరా జయ్యేడివాడు.

వంగ, విహార రాష్ట్రములకు ఆంగ్లేయుల దాస్యము తప్పెడిదేమొ, కాని మొత్తముదేశమునకు అఫ్ఘనుల దాస్యము నవ ధరింపవలసి వచ్చెడిది! క్రైస్తవదాస్యముకలుగకుండనివారింపబడెడిదేమొ కాని మహమ్మదీయ మతోన్మాదుల దాస్యము నిర్ధరింపబడిపోయెడిది.

ఆ యిద్దరిలో గడ్డము లేని వాడు రఘునాథరావు. బాలాజీరావుపీష్వా తమ్ముడు. అతని రాజ్యకాంక్ష నెఱిగియే యతనిని పీష్వా కనిపెట్టి యుండెను. చూచి రమ్మనినఁ గాల్చి వచ్చిన యతని ఉత్తర భారత దండయాత్ర కథ నెఱిగి నప్పటి నుండియు నతని ననుమానించుచు నే యుండెను. అది మొదలు, అతని వ్యాపకముల గనిపెట్టు కొలది నా యనుమానము మఱింత బల పడు చుండెను. పానిపట్టు యుద్ధమున సర్వసైన్యాధిపతి గా ఉద్గీరు విజేత సదాశివరావు భావేను బంపినది యాభయముననే.

రఘునాథరావు కాంక్షా సౌధము లిట్లు కూలిపోయినవని కుమిలి పోవుచున్నాడు. పానిపట్టు ఫలితము దెలిసిన తరువాత తన్నే పంపిన గెలిచెడి వాడ ననుట కవకాశము గలిగినది కదా. అటునుండి కాకున్న, నిటునుండి నఱకుకొని పోగల నని యతని

ఆశ. తనకంటె నధికుడగు దురానీకి సహాయపడి, సామంతు డగుట కంటె అల్పుడగు నైజాముకు తోడ్పడి, ఛత్రపతి యగుట ఘనమే కదా. అందులకే అతడిప్పు డిచట చేరినది! వెలుగున జాతీయాధ్వర హోతృతకు వెలియై...చీకటిని జాతి విద్రోహము నకు గుటియైనది అందులకు! అందులకే ఉద్గీర్ అపజయము నకు గుములుచున్న నైజాం నిజామలీని చెంత జేర్చినది.

ఇద్దఱిలో అగడ్డపువాడే నిజామలీ. పేరునకు దక్కన్ ప్రతినిధులు తామేయైనను, క్రియకు తమ్ముకూడ కలుపుకొని,శా సించుచున్నది మహారాష్ట్రులేనే! తమ నుండి కూడ వారే 'చౌతు' పుచ్చుకొనుచుండిరే! ఈబాధలనుండియు, ఉద్గీరు అవమాన ము నుండియు విముక్తు డగుటకై చూచుచున్న నిజామలీకి వెద కపోయిన తీగె కాలికి తగిలి నట్లయినది. రఘునాథరావును గౌగి లించు కొనినాడు.

'నీవు దక్కన్ నవాబువి, నేను ఉత్తర హిందూస్థానము తో గలిపి మహారాష్ట్రరాజ్యమంతకు ఛత్రపతిని.' అన్నాడురగోబా

'హైదరలీమాకు, షాఆలం మీకు సామంతులన్నమాట.'

'అంతేకాదు బంగాళములోని అంగ్లేయులు మాకు, మదరాసు, బొంబాయిలలోని అంగ్లేయులు మీకు సుంకములు చెల్లించెదరు కూడ.'

'జ్యోతిషము జెప్పుచున్నారా రగోబాజీ?'

'కాదు, కాదు. యదార్థము. ఇప్పటికి చేరిన వార్తల ప్రకారము...పానిపట్టు యుద్ధమున (దురానీ యేమైననేమి?) మహారాష్ట్రులోడినట్లే! యువపీష్వా విశ్వాసరావు చంపబడినాడు.'

'జయము, జయము! మీకు మాత్రమీయుద్ధమున విజ యమన్నమాట'

'ఆ. ఈ విజయము మీకునూ! ఉద్ఘాతకుడు భావే హతు డైనాడు కూడ.' నిజామలీ ఆనందాతిరేకమున కొంతవడి మాట్లాడలేక నిలిచిపోయెను.

రగోబా: 'ఈ విజయము మన కిద్దఱికిని సరిసమానమే. దేశమందఱికిని దుఃఖహేతువైన యీ యపజయము మనయిద్దఱి కిని విజయము, సుఖహేతువు నైనప్పుడు ఈ పండుగ నిట్టి చోటనే గడుపవలయునండీ.' అని ప్రయాణమై, నిజామలీ రెండు చేతులు పట్టుకొని, ఊపివేయుచు, కరచాలనము గావించి 'సాథకుడపజయములనుండి జయము బితుకుకొనును. సోదరా లెమ్ము. సోదరుడు పీష్వా బాలాజీరా వీ వ్యాఘాతమును దట్టు కొనలేడు.అత డీమనోవ్యాధితో మరణించినను మరణించకున్నను నేనే పీష్వాను. మాధవరావు 'మైనరు'. మీరు మీ సేనానివహము లజేకొని ఎత్తి రండు. మీరు జయించితిరా, సరియే. ఒక వేళ నోడితిరా, సంధినియమములు మీకే అనుకూలము గావింతును లెండు,' అనుచు గుఱ్ఱ మెక్కి పూనా దిక్కై నడిచెను.

నిజామలీ ఆలోచనా నిమగ్నుడై కృతజ్ఞతా సూచ కముగా సలాముజేసి, గుఱ్ఱముపై హైదరాబాదు దిక్కైపోయెను.

రఘునాధరావు తాను పీష్వా కావలెను గాని సింధియా సహాయమున షాఆలమును,హెూల్కారు సహకారమున అయోధ్య నవాబును, భాన్లే తోడ్పాటున బెంగాల్ నవాబును, వారందఱి బలముతో కలకత్తాలోని అంగ్రేజీలను కూడ జయించవచ్చు నని తలపోయుచు నిలు జేరెను. భార్య ఆనందీబాయి చిరునవ్వుతో స్వాగతము పలికి, 'బొంబాయి అంగ్రేజీ నేత నుండి వచ్చిన' దను చు నేదియో యుత్తర మిచ్చెను.

# నానా ఫడ్నవీస్

పానిపట్టు రణభూమిని యువపీష్వా, సర్వసేనాధి పతి వారి మరణముల గూర్చి పీష్వా బాలాజీరావు విన్నది... వినినట్లే కుప్పున కూలినాడు. ఆనాడే మంచమెక్కినాడు. రెండవ కొడుకు మాధవరావుకు, తమ్ముడు రఘునాథరావుకు వార్తలు వెళ్ళినవి. సింధియా మొదలగు మహారాష్ట్ర కూట సభ్యులకు గూడ సమాచారములు బంపబడినవి.

ఇంతలో 'యోగిరాజు తమ్ముఁ జూడ దలచి,దయచేసినా' రని ద్వార పాలకుడువచ్చి మనవిజేసినాడు. 'వెంటనే ప్రవేశ పెట్టు' మని అజ్ఞ యైనది. ఆయన వచ్చి నంతనే లేచి ,నమస్కరించ బోయినాడు పీష్వా. కాని వలదని వారించుచు వచ్చి దగ్గర నున్న ఆసన మలంకరించెను.

బా: యోగిరాజ్,స్వయముగా సర్వసంగ పరిత్యాగు లయ్యు సూర్య వంశ్యులను వశిష్ట మునీంద్రు లట్లు మమ్ము గనిపెట్టుచు వచ్చుచున్న తమకు ధన్యవాదములు. తమ కెంతో ఋణపడి యున్నాము.

యో: పరస్పర అభినందనల కిది సమయము కాదు, బాలాజీ, నీతో నొక రాజకీయము నవసరముగా మాట్లాడ వలసి యున్నది.

వారి యింగిత మెఱిగి, ఇతరులందఱు నందుండి చనిరి. 'బాలాజీ, ప్రతిభావంతు డగు యువ పీష్వా గతించినాడు. సర్వసేనాధిపతి భావే వీరమరణ మొందినాడు. మాధవరావు చిన్న వాడు. తమ్ముడు రఘునాథరావు విశ్వసించ దగిలేడు.మహారాష్ట్ర కూటమున నైక మత్యము సన్నగిల్లినది. హొల్కా రనుకొనకయే

పెడ మొగము పెట్టినాడు. గైక్వారు శ్వేతముఖుల స్నేహము మఱిగి, ఎప్పుడో విడిపోయినాడు — అని ఏమి చేయుటకును దోచుట లేదు కాదూ?'

'అవును యోగిరాజ్, ఈ యుద్ధమున సర్వస్వమును గోల్పోయితిమి. తిఱిగి కోలుకొనుటకు కాలము పట్టును. ఈ లోపుగా యూరోపియనులు ---- ముఖ్యముగా నాంగ్లేయులు --- బలపడెదరేమొ యని భయముగా నున్నది.'

'విజాతీయులపై, విమతస్థులపై, వారి నాగరికతపై మోజు పడి, మనవారే వారిని గట్టుకొన నంత వఱకు ఏమంత భయపడ వలసిన పనిలేదు. మన కట్టెయే యొకటి పిడి కానంత వఱకు గొడ్డలి కేమంత భయపడ వలసిన పనిలేదు.'

'అవు నవును. రగోబాను తలచుకొని నప్పుడెల్ల నా కదే భయ మగుచుండును. పఠానులతో గలిసి గోతులు తీయుచున్నాడని వానిని పానిపట్టుకు బంపలేదు. నిజామలీతో గలిసి, రహస్యముగా నేవో కుట్రలు చేయుచున్నట్లు తెలియుచున్నది. బొంబాయి నుండి వానియొద్దకు నిన్ననెవరో శ్వేతజాతీయుడు వచ్చి వెళ్ళినాడట.'

'కానిమ్ము. ఈ సమయమున ధైర్యము గోల్పోయిన లాభములేదు. నిజామలీ తిఱిగి తోఁక నాడించ వచ్చును. కర్ణాటక నవాబునుఁ జేత నుంచు కొని, మదరాసు దొరలు గూడ నదే పనిఁజేయవచ్చును. మన ప్రస్తుత దౌర్బల్యముఁ జూచి, మైసూరు హైదరలీ కూడ అదే నేర్వ వచ్చును. మాధోజీ సింధియా నామ మాత్ర చక్రవర్తి షా అలమునుఁ జేత నుంచుకొని,వాని పేరుఁ జెప్పియు, మనతీరు జూపియు, నుత్తర హిందూ స్థానమున

నుచ్ఛృంఖలుడై తిరుగ వచ్చును! హొల్కారు రసపుత్రులపై నట్లే చరించవచ్చును! భాన్సేయునట్లే రోహిలలాను, అవతలఅయో ధ్య నవాబును గొట్టుకొని, తినవచ్చును. కలకత్తా దొరలు డబ్బు కావలసి నప్పుడెల్ల వంగ పీఠిపై నొక నవాబును దించి, క్రొత్తవాని నెక్కించు చుండ వచ్చును.'

బాలాజీః అవును. ఈ యూహలన్నియు తలలో జేరి, ప్రళ యములు రేఁచుచున్నవి. విశ్వసనీయు లొక్కరు దొఱకినఁ జా లును. సర్వ భాధ్యతలతో, మాధవరావుతో గలిపి, దేశమును ఆయన కరకమలముల నుంచి, సుఖముగా కనులు మూసెదను.

యోగిరాజుః ఆవేశముతో అమంగళము లనకుము. కాని బాలాజీ, తొందరగా నీ వాపని చేయుటయే మంచిది. లేనిచో పరిస్థితులు చేతులు దాటి పోవచ్చును.

బాః అట్టి మహనీయు డెక్కడ నైన ఉన్నాడా? ఆయన మన కొఱకు మన్నించునా?

యోః ఆ. మాధవరావు కతడు కడు కూఱ్పువాడు. మీ గణాంక శాఖలో ముఖ్యుడు, ఒక డున్నాడు.

బాః నానా ఫడ్నవీస్ అను బాలాజీ జనార్దనులా? అయిన సంతోషము. వారి నిప్పుడే ప్రధాన మంత్రులుగా, మాధవరావుకు రాజ సంరక్షకులుగా జేయుచు ఆజ్ఞల నిచ్చెదను.

యోః సరిగా గుర్తించితిరి. కాని తొందర వలదు. రగోబా నే రాజ సంరక్షకునిగా నియమించి, నానాను ప్రస్తుతము మాధవ రావుకు కార్యదర్శిగా మాత్ర మేర్పాటు చేయుడు. సమయము ననుసరించి, సర్వము నతడే చక్క చేసికొనును.

బాః రగోబా రెండవ మీర్జాఫరును, మహారాష్ట్రము రెండవ

బంగాళమును గాకుండ చూచు భారము మీరు వేసికొనినచో యోగిరాజ్, అల్లై.

యోగిరాజు నవ్వి, 'రగోబా రెండవ మీర్జాఫరైనంత మాత్రమున జాలదు మహాశయా! రెండవ దుర్లభ రాయ్‌లు రెండవ అమీన్ చందులు మహారాష్ట్రమున దొటికినపుడు గదా భయపడవలసినది?

బా: రెండవ జగత్సేటులుకూడ దొఱుక కుండవలెనుకదా? యో గిరాజ్, అందఱును మీర్ఖాసిములు, నందకుమార రాయ్‌లు మాత్రమౌదురందురా? అల్లియయిన ధన్యము! మహారాష్ట్రము ధన్యము! భారతమే ధన్యము!

యో: కాని దేశ భవిష్యత్ అంతయు మొగల్ పాదుషా షా ఆలమ్ పోకడల ననుసరించి యుండును. అతడెన్నటికినీ అంగ్రేజీ ల బంచఁ జేరకుండ చూచు కొన వలయును.

బా: అంతయు నీదే భారము యోగిరాజ్!

ఇంతలో రఘునాధ రావు అన్నను బరామర్శించ వచ్చె ను. యోగిరాజును జూచి, నమస్కరించెను. యోగిరాజు ఆ నమ స్కారమున్ను శివార్పణము గావించి, లేచి వెళ్ళి పోయెను.

పీష్వా బాలాజీరావు నియామక ఆజ్ఞలను రెంటినిస్వయ ముగా వ్రాసి, వ్రాలుజేసి, తమ్మునికందించెను. ఇంతలో మాధ వరావు, నానా ఫడ్నవీస్ వచ్చిరి. పరస్పరాభి వందనముల తరు వాత రగోబా తన నియామక పత్రమును దాను౦చుకొని, రెండవది మాధవరావు కిచ్చెను. మాధవరావు చిరునవ్వుతో దాని నందు కొని, నానా కిచ్చె. నానా దానిఁ గన్నుల కద్దుకొని, 'మహాప్రసాద' మనుచు పీష్వా పాదము లంటి, నమస్కరించెను.

బాలాజీరా వతని రెండు చేతులనుఁ బట్టుకొని, వానిని తన ఎడమ చేతిలోనికి దీసికొనెను. కుడిచేతితో దగ్గఱనే కూర్చుండియున్న మాధవరావు కుడి చేతి నందుకొని, దానిని నానాచేతుల నుంచుచు రఘునాథరావు వంకఁ జూచెను. రఘునాథరావు గూడ అన్నగారి పాదములంటి నమస్కరించెను. పీష్వా అతనిచేతుల లో మాధవరావు ఎడమచేతి నుంచెను. 'మాధవరావునే కాదు మహారాష్ట్రమును... భారతదేశమునే... మీచేతుల నుంచుచున్నాను. అగ్బర్ మహనీయునియొక్క ఈ ఆదర్శస్వర్గమును శివాజీ మహరాజ్ యొక్క యీ అనుకృతశిల్పమును మీ ధర్మ కర్తృత్వము లోనికి వదలు చున్నాను. బాలాజీవిశ్వనాథ్ బహాదుర్షాల యీభారత జాతీయ మహాసంసర్గమును,పితృపాదుల నుండి సంక్రమించిన నా యీబాధ్యతాభారమును మాధవరావు పసిచేతులు మోయలేవని, సమర్ధములగు మీచేతుల నప్పగించుచున్నాను. విదేశీయులు, విజాతీయులు, విమతస్థులు, విద్రోహులు విరోధులు, విలయ తాండవము జేయుచున్న యీ కాలమున మీ బాధ్యతలను నిస్వార్ధముగా, ససమర్ధముగా నిర్వహించి, దేశమాత అనుగ్రహమునకు పాత్రులు గండు. చారిత్రకుని దృష్టి కెక్కగ్గలుదు. ఈ అవకాశము నొందగల్గిన మీరు ధన్యులు.' అనుచునే కనులుమూసెను.



# ద్రోహి – విరోధి

'కనకపు సింహాసనమున శునకముగూర్చుండజేసి - - - న వెనుకటి గుణమేల మాను, - - -?' అనెను రామశాస్త్రి. నానా ఎంతటి రాజనీతిజ్ఞుడో ఆయన అంత న్యాయ శాస్త్రవేత్త. రఘునాధరావు చర్యల నిద్దఱును గనిపెట్టుచుండిరి. మాధవరావు కు వారి యండలేనిచో జాల కష్టమయ్యేడిది. రామశాస్త్రిఅనుభవము, నానాఫడ్నవీస్ మంత్రాలోచనము గలిసి, పదునెనిమిదేండ్ల బాలుడైనను వానిని పీష్వాపదవికి యోగ్యుని గావించినవి. 'కంటకప్రాయమైన కంపను గొట్టి, కంచెగావేసి చూచితిమి. చేను మేయు స్వభావముఁ గనపఱచుచునేయున్న దందురా? నెత్తిన నిప్పులు పోయుదము. మాడి, బూడిదయయిపోగలదు!' అనెను నానా.

మాధవరావు నానా రాజనీతిజ్ఞత కచ్చెరు వందెను. 'నానాజీ, సిద్ధార్థుడు బుద్ధుడుగాగాక, రాజ్యపాలకుడుగా నుండ నొప్పినచో ఒక 'నానా' యయ్యేడువాడు కాబోలు.'

రామః పీష్వా పోయి ఆరునెలలైన గడువకయే, నిరుడొక సారి యీ నిజామలీయే మనపై కెత్తివచ్చినాడు. మాధవరావు చేతఁజిక్కి, శరణనగానే...తోడుదొంగ రఘోజీభాన్లే చే ప్రతిపాదింపఁజేసి, క్షమించి, వదలినాడీరగోబా! ఇప్పుడు తానే స్వయముగా నర్ధించుచున్నాడు!! దీని కింక అంతులేదా?

మాధః ఇంక సహించరాదు నానాజీ. బంధించి, న్యాయస్థానమున నిలిపి విచారింతము.

నానా : తొందర కూడదు బాబు. తాళపుచేతిని దొంగయొద్దనే యుంచిన అది కొంతభద్రము. అది అంతరాత్మపై

కొంత పని చేసి తీరును. ఇట్టివారు తెగపడినచో ప్రమాదము సంభవించును. సమయముజూచి, యాపనినే చేయుదువులెమ్ము

ఇంతలో ధనాజీవచ్చి, 'గోదావరి యొడ్డున, రాక్షస భువన్ యుద్ధ క్షేత్రముననే, సైనిక శిబిరములోనే ఖేల్ తమాషా కాలక్షేపము జేయవలయునట. పిలిపించి, ఆజ్ఞాపించినారు రగోబాజీ.'

రామః ఏమంటివి? ఒప్పుకొంటివా? ద్రోహి, విరోధి! వారికి వినోద కాలక్షేపము కావలసివచ్చినదా? అహా! కాలవైపరీత్యము! అయిన మాతో చెప్పవచ్చితివా?

మాధః మమ్ములఁగూడ తీసికొనిపోవచ్చితివా?

నానాః అవును. తప్పక పోవుదము. మనమీ అవకాశమును సద్వినియోగపఱచు కొందము.

ధనాః అవునండీ. యోగిరాజురచించిన చారిత్రకభారతములో అభాగ్యపర్వము నేటి కథ.

రామః నానాజీ అడుగుజాడలు మాకును అవశ్యము అవలంబనీయములు! ఇంకేమి? లెండు.

మాధః ఇప్పుడే పోవుదమా మనమును?

నానాః ధనాజీ, నీవుపోయి, కథసాగించుచుండుము. యువపీష్వాయు నిప్పుడే వచ్చును. మేమా?--- మాసంగతిఆలోచించెదములే! మఱిఁ మేళము వారందఱు సిద్ధముగానున్నారా?

ధనాః ఆ! అందఱు! ఆటకు,పాటకు మహర్‌బాబా, డోలుకు వడ్రంగి సునేర్జీ, డోలకుకై కసాయిమెహిదీ,ఏకతారకు చాకలి దోబ్జి సిద్ధమై యున్నారు. వేషరచనకై మంగలిఅలంకార్, కాగడాలకై కుమ్మరి చక్రి ఎప్పటివారె యున్నారు కదా.

నానా: చివర 'జీ—' రాగముఁ దీయుటకు, వ్యాఖ్యానము లకు కమ్మరి కాంశీ, వంశీ ఉన్నారు గదా!

* * * *

రాక్షసభువన్ యుద్ధరంగమున నిజామలీ శిబిరమున పీష్వాకు రాజసంరక్షకుడగు రగోబాతో గలిసి, కొలువు దీరి యుం డెను. పూనాపై దండెత్తి వచ్చి, యువ పీష్వాచే నోడి, చావుతప్పి కన్నులొట్టవోయియు నట్లు లేనేలేడు విరోధి నిజామలీ! ద్రోహికాక పోయినచో తమకు పట్టువడిన శత్రువును స్వేచ్ఛగా వదలుటయే గాక అతనితో నొక అంతరంగిక మిత్రునితోవలెగూర్చుండి, మం తనములేకాక వినోద కాలక్షేపములకును సిద్ధపడునా రగోబా!? తన్నదుపుఁబెట్టువారు లేరని కాదా అతని పొగరు?

యువ పీష్వా మాధవరావుకు మాత్రమొక ఆసన ముం చిరి. నానా, రామశాస్త్రి, మొదలగువారికి లేవు. కాని ఆచారము ప్రకారము ఇతర మహారాష్ట్రకూట సభ్యులకు గూడ ఆసనము లున్నవి. చక్రి కాగడాలను చక్కఁజేసి వెళ్లెను. డోలుతో సునార్జీ, డోలకుతో మెహిదీ వచ్చి, సరిజేసికొనిరి. ధోబ్జీ, ఏకతారను సరిజేసి కొని, స్వరము వేయసాగెను.

రెండుకాగడాలను దరిజేర్చి, వాని ఏకజ్వాలపై నింత గుగ్గిలముఁ బోసినారు. ఇటు కెలంకులనుండి, యిద్దఱు వంత గాండ్రు కాంశీ, వంశీ 'జీ—' రాగముఁ దీసికొనుచువచ్చి, పల్లవి నెత్తిరి. మధ్య మహర్‌బాబా నిలబడి కథ కుపక్రమించెను.

మహార్: వినుము దేశ స్వాతంత్ర్య రక్షణా విహితయో ధనాజీ॥
కనుము వంగ, కర్ణాటకములలో కల్గిన యాకథలూ ॥వి॥
మన మహారాష్ట్రసీమనెచ్చటన్ మఱల కలుగరాదు ॥వి॥

కొంశీ: మహారాష్ట్రములోనేమి? భారత దేశములోనే ఎక్కడనూ—

వంశీ: ఆకథలు పునశ్చరణ కాకూడదురా! అవి ఏవనగా-

ఇద్దరు వంతలు: వినుము దేశస్వాతంత్ర్య రక్షణా విహితయో ధనాజీ।

మహద్: తెల్లజాతి అంగ్రేజీ వర్తకుల్ దగిన దినములవ్వి ॥వి॥
దేశవర్తక, వ్యవహారములు, దేశ పరిశ్రమలు ॥వి॥
హిందూమతస్థుల అధీనములో నెసగియుండెనండీ ॥వి॥
అందు ముఖ్యముగ సేటులనెడి "బన్యాల" వశమునందు ,,

కొంశీ: ఎవరు? ఎవరు? సేటులా? అనగా మన వైశ్యులేనా? కొంపతీసి, యీ నల్లవర్తకులు ఆతెల్ల వర్తకులకు మన దేశమునే అమ్మఁజూపుట లేదుకదా?

వంశీ: అవునదే నేఁ జెప్పునది! కర్ణాటక నవాబు మహమ్మదలీ చే రాజ్యమునే తాకట్టు పెట్టించి, అప్పులిప్పించు పటుకుఁ దెచ్చినారు.

కొంశీ: శివ! శివ! అంత పటుకు తెచ్చినారు?

మహద్: అంతవటుకేకాదు. ఇంకను వినుము.

వర్తకమున కనుచు నౌకరి జూచి. యొకరు వచ్చినారలిటకు ॥వి
అట్టి తెల్లవారిలోన ఫ్రేంచివారు, నంగిరేజివారు ॥వి॥
రాచకార్యములను చేయి చేసికొనుచు, రాజకర్తలైరి ॥వి॥
ఆర్కాటుజేరి, చదరంగపాటల నాడసాగినారు ॥వి॥
అంగిరేజివారె దేశరాజకీయ మందు మిగిలిరండీ ॥వి॥
అన్వరుద్దీను, చాందు సాహేబు లంతరించినారు ॥వి॥
మహమ్మదలీని కర్ణాటపీఠిపైఁ మనిపినారు నేడు ॥వి॥

కొంశీ: అరె రదే రరెరే! అయితే సరే. కాని మన రాజమిత్రులు నైజాం ప్రభువుల సంగతేమిటిరా?

వంశీ: విను.

మహద్: నాజర్ జంగు, ముజఫర్‌జంగు నైజాము లైనారు। ॥వి॥
మొగల్ విరోధులు పఠాణ నవాబులు ముఖ్య ద్రోహు లండీ। ,,
నిన్న సలాబత్ ఏమైనాడో నేడు నిజామల్లీ। ,,

కాంశీ: నిజామలీ నవాబులిక్కడనే. దయచేసి ఉన్నారు గదరా!

వంశీ: వారు మన మిత్ర కోటిలోని వారుదా!

నిజామలీ: అవునవును. ఇది సమస్యా నేడు. మా పానీయం తీపియా? మీ కథ తీపియా? నా నాలుక కు తెలియు నందురా ఎక్కువ తీపి? లేక మీ చెవులకా? ...కాదు, కాదు. మా చెవులకా? మా నాలుకకా? ...కాదు, కాదు. ఏమో! పాడండి. ఆడండి. ఇదిగో నిద్ర లేచుచున్నాను!

రగో: ఆపండి. ఈ కథ ఆపి, ఛత్రపతిసాహూ కథచెప్పండి

రగోజీ భాన్స్లే అప్పుడే వచ్చుచు 'పోనీయండి. శంభాజీ, జహనారాల ప్రేమ కథ చెప్పండి' అనెను.

నిజామలీ: నాకవేవియు ఇష్టము కావు. ఈ కథే కానిండు. అంతః చక్షువు లేవియో తెఱచు కొనుచున్నట్లున్నవి. సాగనిండు.

కాంశీ: అయితే సోదరా, వంగ దేశమునకు తీసికొని పోమమ్ములను!

వంశీ: ఆహా!——————

మెహ; వంగద్దేశమందు నిల్చినట్టివారు నాంగ్లజాతివారే ॥వి॥
అల్లావర్ధీఖాను నున్నవాళ్ళు నదలి, అణగి మణగినారు ,,
అతనికొడుకు సురాజ్ రాజరికములో అదను దొఱికెనండి ,,
జగత్సేటును, అమీరాచందును చాటుకుట్ర చేసి, ,,
రాయదుర్లభుం దను దివానుతో చేయి కల్పినారు ,,
సేనాపతియగు మీర్జాఫరును శాహి జేసినారు ,,
ప్లాసిలోన సీరాజు నవాబును మోసగించినారు ,,

కాంశీః అరె రరె రరెరే! పాపం! ఎంతపని యైనది? సేటు లంటివే. వారిని గూర్చి కొంచెము చెప్పుము. అట్టి వారేసీమలో ను ఏకాలము లోను ఉండవచ్చును.

వంశి; అయితే విను

ఇద్దఱు: భళానోయి భాయి తమ్ముడా-సై। భాయి భళానోయ్ దాదానా
మహర్: హిందు వైశ్యులయిన సేట్లనే సై.
'బన్యా' లనిరి ఆంగ్లవణిజులు సై.
తెల్లవారి గృహ దివానులై సై.
తెల్లవారియిళ్ళ స్టీవర్డులై సై.
వారిపనుల దిద్దుచుండిరి సై.
నిమ్నజాతులగుట చేతనూ సై.
నీచములకు పాలుపడుచునూ సై.
అడుగు మడుగు లొత్తనేర్చిరి సై.
దొరల పీడనముక కలవడీ సై.
పౌర పీడ కొడం బడిరయా సై.
జిత్తు, బొంకు, మాయ, మోసము సై.
వర్తకమ్మనుచు చేసిరి. సై.
బాధ లనుభ వించి యుండియూ సై.
బాధ పెట్ట సాగి రేమియో సై। భళానోయి....

కాంశీః అరె రరెరే! కష్ట జీవుల కడుపులు కొట్టి లాభముల తో కనకాభరణములు చేయించుకొని, కులుకుట మొదటి నుండి యున్న దన్నమాట ఈ జాతికి!?

వంశీః అవునురా చారిత్రక ప్రసిద్ధు లేరా అందులో వీరు! ఇంకను విను వీరి ప్రతాపము.

మహర్: తందానా తం దాని తరదనా తం
ఎవరు కాని దొరలు దిగిన ఓడలో తం
ఒకరు వెళ్ళి బన్యాల్ తోడితెత్తురు

చేత పైస ఉండ దనుచు తెలియుట
చేవి లోని పైస మదుపు పెట్టును
ఊరు. డొంక తెలియకుంట వారికి
వారి, వీరి గుట్లు నూరి పోతురు తం.
సుంక మెగకొట్ట నేర్పుచుందురు
లంచములను పంచిపెట్టు చుందురు
దేశభాష తెలియదనుచు తెలియుట
దుబాసీలుగా పనికివత్తురు
దొరలు కోరు తెల్ల దబ్బు మాత్రమే
ఎట్లు తెచ్చి యిచ్చు చున్న పోనితే
పేరు వాడు కొనగ నిచ్చి వైతురు
చెప్పుకొన్నపోనీ, చెరచి వేయనీ తం.

వంతలు: తందానా తందాని తంతనానా

శాంశీ: అట్లయిన మన నల్ల దొరలే ఇక్కడికి వచ్చిన తెల్ల దొరలను చెఱుపు చున్నారందువా?

వంశీ: ఆహా! ఆంగ్ల జాతికే అంతరాత్మ లనదగిన ఎడ్మండ్ బర్క్ మహాశయుడు కూడ ఈ అపవాదే వేయుచున్నాడు.

మెహ: అవునుర. అది ఉత్త వాదు కాదు. విను.

వంతలు: వినుము దేశస్వాతంత్ర్య రక్షణా విహితయో ధనాజీ!
పేరుమాత్రమునకె వారు, నిజముగా వీరే అసలు దొరలు
ఋణప్రదాతగా అధికారముతో ఋణగ్రస్త దొరల
వశమునుంచుకొని, దొరలకు దొరలై పాలించుచునుండు
అతని పేరు చెప్పి, అన్నిచోటుల కరుగు చుండు నతడు
దొరలపేర్లు చెప్పి, బన్యాల్ చేసెడి దుష్టచేష్ట లెన్నొ?
దోతురు, దారులుకొట్టి, చంపెదరు దొరలపేర్ల మీదె
పాపమందు హెచ్చు, ఫలము నందు కొద్దివంతు పెట్టుచుండు

కాంశీ: ఓహెూహెూ! అయితే సరే. కాని ఇక్కడ మన నీరు ఒంట పట్టిన తరువాత, బన్యా నీతిని వారు మనలోనే ఇంకొకరి యెడ చూప రందువా?

వంశీ: ఎందుకు చూపరు? చూపుచునే యున్నారు. ఆర్కాటు నవాబు మహమ్మదల్లీ రాజ్యమునే తాకట్టు పెట్టుకొని, ఋణము లిచ్చు చున్నారనలే?

కాంశీ: అయితే ఓరీ, వంగలో బనియా లనే నల్ల దొరల సహాయముతో దేశీయ పాలనను హస్త గతం చేసికొనినను ఆర్కాటులో ఈ తెల్ల బనియాలె స్వయముగా ఆ పని చేసి రందువా?

వంశీ: ఆహా. అవును. నల్ల చీమలు పెట్టు పుట్టలనే తెల్ల చీమలు ప్రవేశించు చుండుట, తరువాత వానినే పాములు దురాక్రమించుట! అంతయు సహజమే కదా? ఇంకను వినుము.

వంతలు: ఇనుము దేశస్వా........

మొహ: బనియ లనెడి మన జాతి ద్రోహుల పాప కథను వినుడు ॥వి॥
నిజ ఉపాధికై పాప కృత్యముల్ నేర్చి, నేర్పువారు
సంకు నిల్వలన్ దాచి, లేవని చాటుచుండువారు
దొంగ యంగడుల చాటు నిల్వలః చాల ధరల కమ్ము
అక్రమార్జనల్ చేసి, పౌరుల నెత్తు త్రాగువారు
లక్షలున్న వారి తలల చేతు లుంచి భిక్ష మెత్తజేయు
దేశధనము తమకు కాకయున్న విదేశ పరముజేయు
రాజ్యసుంక మెగకొట్టి, ద్రోహముః రాజ్యమునకు జేయు

కాంశీ: ఆహాహా! కష్టజీవుల కష్టఫలమును హరించు ఈ సంఘ ద్రోహులతే దేశ స్వాతంత్ర్యమును అమ్మగలవారు కూడ నన్న మాట!

వంశీ: అవునురా ఒరే! కుళ్లును పెంపొంద జేసిన కాని యీ శ్రామికోప జీవుల బ్రతుకులు వెళ్ళవు కాబోలురా!

కాంశీ: ఆహా! అవునురా! కుళ్ళిన చోట గాని పురుగులు బయలు దేరవు కాదు?

వంశీ: అవును .అంతే కాదురా! కుళ్ళని చోటును కుళ్ళ చేసిన గాని ఆ కుళ్ళు బ్రతుకులు వెళ్ళవురా.

కాంశీ: అయితే ఒరే ఒక కులమును మన మి ట్లాడిపోయు చున్నామే! --- సంఘమును మేల్కొల్పుటకే అనుకో --- అది వారికి కష్టము కాదురా?

వంశీ: ఛీఛీ! కులమును కాదురా మన మనునది! వృత్తిని! ఏ కులము వారైన నేమి? ద్రోహవృత్తి కలవడిన ప్రతి జనుని యెడను 'సంఘము పరాకు కలిగి ఉండవలెరా. మన విమర్శ విధ్వంసాత్మకముగా నుండరాదు. నిర్మాణాత్మకముగా నుండ వలె. కానీ మన సందేశ మేమో బరువు దించు కొందము.

వంతలు: వినుము. -----

మెహ; చేతిలోన అదను ఉన్నప్పుడు చేయి విడువ రాదు ॥వి॥
లాతి చేత తాము కూడ చిక్క చాల చింత పడగ వలయు
తాము తప్పకొనిన తప్పకొనగ వచ్చు! తరతరముల గతియొ?
పిల్లపిల్ల తరము నోళ్ళు కట్టి పరుల నోళ్ళు నింప వలయు'
వణిజాలె రాజ్యములను గూల్చిననూ! వారెగెల్వ నైన!
నల్లవారు ద్రోహమునకు బూనినన్ తెల్లవారి పంట!

వంశీ: ఆఁ? ఆఁ? అంతే నందువా?

కాంశీ: మఱి యేమి? నేడు వంగ భూములో చూడు.

మెహ; వినుము దేశ స్వాతంత్ర్య రక్షణ విహిత యోధనాజీ
జగన్సేటు, ఓమి చందు చదకు చోటు చక్క జేసినారు
కాని పుట్ట పెరిగి పడగ పాము లెన్నో లోన జేరినవిరా
మీర్జఫరును జేర్చి, క్లైవు మొదటగా మీద జేరినాడు
మీర్ కసిమ్ శక్తి హోల్వే లంత కంత మేసిపోయినాడు

తిరిగి జఫరునెత్తి వాన్సిటార్టుకూడ తేర జుట్టినాడు
జఫర్ సుతుని నజింనుంచి స్పెన్సరూ చాల నంజినాడు
పొదుప రాజ్యమ్మూడి గతి కనక పంచ చేరినాడు
పానిపట్టు దెబ్బ కిపుడె మరాఠీల్ పెనగి, లేచినారు
తిరిగి క్లైవునిటకు పంపి యుంటలో తిక్కగు డేమికలదో
ఎట్టి పథకముతో నతడిటు వచ్చెనో? హెచ్చరికలు ప్రజకు!
మొన్న బక్సరు రణమున పట్టుకొన్న పాదుషాను
ఆశపెట్టియో, బెదరకొట్టియో, అవశు జేతురేమొ!
ఏవిధిప్రాతలు వ్రాసి యిచ్చునో? భావి ఎట్లు లగునో?
క్లైవు వెళ్ళినను క్లైవీయులు వక్షస్థలి నెక్కెదరు
పాతదొరల అనుభవములు క్రొత్తల వారసత్వమగుట
బనియాలప్పుడు దొరల కాళ్ళను పట్టవలసివచ్చు
చరిత్రకారుని శాపనరకమున జ్వలించిపోయెదరు
దేశ ధనముసొరంగవాహిని విదేశములను పట్టి
దేశిరక్తము విదేశీ దాహము తీర్చవలసి నపుడు
జాతి సంస్కృతి విజాతి పాద సంస్థగితమైన యపుడు
ఎంత ఏడ్చినను ఫలమేముండదు ఎంతకొట్టుకొనిన
హిందూముస్లింలైక్య సంఘటిత మొంద గలుగుడయ్యా
శివాజి, అగ్బర్ జాతీయోద్యమ భవము జేరుడయ్యా
తేరిచూచుటకు నశక్య విధిప్రతిజ్ఞను గొనుడయ్యా
వినుము దేశస్వాతంత్ర్యరక్షణా వివశ యో ధనాజీ -

కాంశీః ఓహెూహెూ! ఏమి చెప్పితివి యోగిరాజ్! నీ ఋణము తీర్చుకో లేము. మహాశయా, సమయమునకు తెలుపు చున్నావు పరాకు!

వంశీః ఏమి గర్జించు చున్నావు ప్రజాకవీ! భరత మాత నీ ఋణము తీర్చుకొనలేదు యోగిరాజ్! రాళ్ళను కూడ దేశభక్తులుగా చేయుచున్నావు!

నిజామలీ: బుద్ధి వచ్చినది రగోబాజీ! నేటినుండి మన జీవితములను హిందూ ముస్లిం ఐక్యతా మహోద్యమములో గడుపుదము గాక.

అదే సమయమున నానాఫడ్నవీస్, రామశాస్త్రి మాధవరావుతో సహా ప్రత్యక్షమైరి. అందఱును కరచాలనము గావించుకొనిరి.

ధనాజీ మహర్ బాబు, కాంశీ, వంశీలతో వచ్చి, నమస్కరించెను. రామశాస్త్రి ధనాజీని కౌగిలించు కొనెను. తనచేతి కంకణ మొక దానిని తీసి ఆతనికిని, రెండవ దానిని మహర్ బాబుకును తొడిగెను.

నిజామలీ, రగోబాలు తమ కంఠము లందలి ముత్యాల హారములను దీసి కాంశీ, వంశీల కంఠ సీమల నలంకరించిరి.

ఇంత జరుగు నపుడు మధ్యలో నొకసారి రగోబా నిజామలీ నోర కంట జూచి, నటనార్థ సూచకముగా నవ్వుటయు, నిజామలీ ప్రతి నటన జేయుటయు నానాఫడ్నవీస్ గుర్తించక పోలేదు. 'కుక్కల తోఁకలు వంకరలే' అనుకొని యుండును. 'పుట్టెలతో పుట్టిన బుద్ధులు పుల్లలతోగాని తీరవులే' యనుకొని యుండును.

రామశాస్త్రి రగోబా, నిజామలీలను దీసికొని గుఱ్ఱములపై పూనా రాజభవనమున వారి సన్మానమునకై వెళ్ళెను.

కాంశీని నైజాము, ఆర్కాటు చార సంఘములకు వంశిని బొంబాయి ఆంగ్రేజీ ప్రాంతమున చారుల జట్టుకు నాయకులగావించెను. మహర్ బాబాను కలకత్తా విలియం కోటలోను, ధనాజీని వంగ, విహారములలోను, అయోధ్యలోను చార దళములపై నియోగించెను.

దేశ భవిష్యత్ మహారాష్ట్రుల అధీనమున నున్నదని మఱువకుడు. స్వార్థము, పిఱికితనము ఎంతకైన దారితీయును. అట్టి వారిని గని పెట్టుడు

# చారచక్షువు

ఎవరా శ్మశ్రుధారి? ఎవరికొఱ కట్లాయన చీకటిలో నిలబడినది?... ఎవరా ఆగంతుకులు? ఆగుడు. వారేదో యనుచున్నారు! 'జైభవాని!'

'జైభారత్' అని యతడు వెనుదిరిగినాడు. వారు వెంటపోవుచున్నారు. అవి వారి సంకేతములు కాబోలు. వారెక్కడికట్లు పోవునది? వారెవరు? ... అదిగో ఏదియో కొండ సానువు, గుహ. దానిలో కుటీరము! ముగ్గురును లోనికేగి, తలుపు వేసికొనినారు. వారేమో సంభాషించుచున్నారు. వినదము రండు.

యోగిరాజ్: — 'చెప్పుడు. పూస గ్రుచ్చునట్లు చెప్పుడు. మీమాటలుకూడ ఇంతకుముందు విన్నవానితో సరిపోవలెను. మీర్ఖాసిము మన షాఆలము ప్రభావమునకు లోనైనవాడే కదా?'

'ఆ. ముమ్మాటికిని. నందకుమారరాయ్ చేతిలోనివాడు నవాబు. అతడు మన జాతీయోద్యమభ్రాతల లోనివాడేకదా.' 'ఇంకెక్కడి నందకుమార్‌రాయ్?ధనాజీ,రాయ్ ఆంగ్రేజీలకుచిక్కి, వారి బందిలమున బడినాడటకదా?' ధనాజీ నవ్వెను. 'వారు పట్టుకొనినది రాయ్‌నికాదు. అతని మొగమువా డింకొకనిని. తన 'డ్యూఢీ' గా ఉపయోగించు కొనెడివాడు రాయ్ వానిని. రాయ్ అజ్ఞాత వాసములో నుండియే విప్లవములకు అను విప్లవములు నడుపుచున్నాడు. ఇది రహస్యము, లో - వలయము వారికే తెలియును. భారతీయులైనచాలు. ద్రోహులను దేశభక్తులుగ మార్చ గలడు.

యో : ఆశ్చర్యము! మఱి రాయ్ మీర్జాఫరుకును గూఱ్చి వాడేయందురు? తాను పునరభిషిక్తుడైనప్పుడు కారనుండి రాయ్ యొక్క ద్వైధీని విడిపించుకొని కూడ రాయ్‌నే దివానుగా తీసి కొనుటకై పట్టుపట్టె నందురు? ...ఏమి మహర్?

మహా: రాయ్‌ని తిఱిగి అజ్ఞాతము నుండి పైకి తెచ్చుకొనుట కది దేశ భక్తుల ఎత్తు.

ధనా: మీర్జాఫర్, రాజదుర్లభ్ అదుల కుట్రలనాడు కూడ ఈయన కనిపెట్టియే యుండెను. శక్తి లేకపోయినది. కాని దానిని తప్పించెడివాడె!

యో: మీర్జాఫరుని తొలగించి, మీర్ఖాసిం నెక్కించుటలో కూడ రాయ్ కారకు డంటిరి?

ధనా: అవును! మీర్జాఫర్ ఆంగ్రేజీల చేతులలో కీలుబొమ్మయై, దేశహితము మఱచినాడు! మీర్ఖాసిం మన జాతీయోద్యమములో జేరి, ఆంగ్లేయులను తఱిమి వేయుటలో సహకరింతునని ప్రమాణము జేసినాడు!

యో: ఇంతచేసినను మీర్జాఫర్ రాయ్‌నే ఎట్లు నమ్ముకొనినాడు?

మః అక్కడనే ఉన్నది రాయ్ రాజకీయనిపుణత. యోగిరాజ్, రాయ్ ఎప్పటి కప్పుడు మీర్జాఫర్‌కు భవిష్యత్తుచెప్పుచుండినను అతడు మేల్కొన లేక పోయినాడు.

ధనా : మీర్ఖాసింనాడు కూడ మీర్జాఫరును కనిపెట్టియే యున్నాడురాయ్. మీర్జాఫరు చేయులేని పనులను మిర్ఖాసిముచే చేయించుకొందుమనియు, దేశమున కతనిపని తీరిన తరువాత

తిఱిగి తన్నే నవాబు గావించుటలో సహకరింతుమనియు, షా ఆలం తమవాడే ననియు ఊరడించుచునే యున్నాడు!

యో: మీర్ఖాసింతో పని పూర్తిగా తీరకున్నను, తానే తీరి పోయినాడు పాపము! అనుకొనిన పని తీరకముందే అసమర్థుడైనను మీర్జాఫర్నే తిరిగి నవాబుజేయవలసి వచ్చినట్లున్నది.... భగవంతుని ఉద్దేశ్య మింకొకటి ... ఏదియో ఉండియుండును! ఈతాత్కాలిక అపజయముల వెనుక ఏదియో ముఖ్యవిజయము ఉద్దేశింప బడినట్లున్నది దేశమునకు.

ధనా: ఏమో యోగిరాజ్, మీర్ఖాసిం పతనము...అది అతనికేకాదు. వంగకే, భారత దేశమునకే పతనముగా దోచుచున్నది.

యోగి: ఏల? షాఆలం లేడు? అయోధ్య వజీరు షుజా ఉద్దౌలా లేడు? నందకుమార్ లేడు? మీర్జాఫర్ ముక్కుత్రాళ్లు వారిచేతులలో లేవు? ఇందరుండియు వంగ పతనమా?

మహర్: ఎందఱుండియు లాభములేదు యోగిరాజ్! మీర్ఖాసిం పతనముతో షుజా ఉద్దౌలాగుండె ఝారిపోయినది! బలవంతులతో విరోధమెందులకని అంగ్రేజీలపిలుపుకై చెవులు పెద్దవి చేసికొనినాడు.

ధనా: షుజా అసహాయమువలన విరిగిపోయిన భుజముతో పిఱికి వడిన గుండియతో, చెడిపోయిన మేధస్సుతో షాఆలం శత్రువుల పాదప్రదక్షిణములకు పాల్పడి తిఱుగుచున్నాడు. మహా రాజకీయవేత్తలయిన అంగ్రేజీలు ప్రాంగణమును జేరిన పాడియావును పారద్రోలుదురా స్వామిజీ? నట్టింట కట్టివేసికొని, దువ్వుచున్నారు!

మహర్: బక్సర్‌లో షాఆలం చేసినది యుద్ధము గాదు, వియ్యము స్వామిజీ!

యోగి: ఛిఛ్ఛీ! ఆత్మను చంపుకొని, తనువును పెంచుట కంటె తనువునే విడిచిపెచి, అభిమానమును నిలుపుకోవలసినది! బాగుండెడిది!... ... ఇంకేమున్నది? అనుకొని నంతయు నైనది! చరిత్ర తీరే మారిపోవుచున్నది!... నామమాత్రు డయిన పాదుషా షాఆలం నొక 'గడ్డిదూడ' గావించి, భరత మాత నింక పితుకు కొందురు కాబోలు శ్వేతముఖులు!

మహ: మీ రనినట్లే షుజాఉద్దౌలా రంగు కూడ తేలిపోవు చున్నది యోగిరాజ్! క్రమముగా ఆంగ్రేజీల చెప్పులు మోయు వఱకు రాగలడు

ధనా: నందకుమారరాయ్ ఒక్కడు... ఇంక మనమెవ్వ రిలో నయిన ఆశలు పెట్టుకొనవలె ననిన!

యో: ఆఁ ? చరిత్రకారుని చిత్రణలో రాయ్‌కి ఊసరవెల్లి కున్నయన్ని రంగులు నున్నవే? దొర టోపీ కూడ పెట్టగల వాడుగ నున్నాడే?

ధనా: హరి హరీ! ఎంతమాట యోగిరాజ్! రాజులకు సహజ మగు మీ 'చార-నేత్రము' లతో చూచి తెలిసికొనుడు. కలకత్తా చీకటి గది వంటి అబద్ధములను కల్పించిన హాల్వెల్ ప్రభృతుల ప్రచార వాఙ్మయము చరిత్ర యని భ్రమించకుడు. వారిచ్చు రంగుకటకముతో జూచి, దేశభక్తుల నపార్థము జేసికొనకుడు.

మహ: దేశహితార్థమైనపుడు (వసుదేవుడు గాడిద కాళ్ళు పట్టినట్లు) రాజదండము పట్టుకొను చేతులతోడనే మీర్-నవాబు

లెందఱి కాళ్ళు పట్టుకొనినను తప్పకాదు యోగిరాజ్! అది రంగు మాచ్చుల క్రిందికి రానేరదు!

యో: సరియే. ప్రస్తుత వాతావరణ మెట్లున్నదందురు? వంగలోని కట్టె కంటుకొనిన నిప్పు దానితోనాగు నందురా? లేక-

ధనా: ఆ విషయమే యోగిరాజ్ మేమిప్పుడు తెలుప వచ్చినది! బక్సార్ విజయముతో హాల్వెల్,వాన్సిటార్టు నేతలకును,కూట్ మన్రో చమూపతులకును కనులు నెత్తికి వచ్చినవి. తముపై కనులు పెట్టుకొనియున్న పిండిబొమ్మ-పాదుషా షాఆలమునకు కొంచెము ప్రాణము పోసి, తీసికొని వచ్చి, అగ్బర్, బహదుర్షా లధిష్టించిన ఢిల్లీ గద్దెపై నెక్కఁ జూచినారు. కాని ఇంతలో ఇంగ్లండు నుండి క్లైవు వచ్చుచున్నాడని ఆగినారు.

యోగిరాజు నవ్వినాడు. 'క్లైవు వారియంత తెలివితక్కువ వాడు కాడు. రాజపుత్రులు, మరాఠీలు, మొగలులు ఇందఱితో గూడిన ముప్పది కోట్ల భారతీయులతో పట్టపగలు, బహిరంగముగా ముఖాముఖి ద్వంద్వ యుద్ధమునకు దిగగల శక్తి లేదని తెలియు నతనికి! సాటి పరాసు వారికినీ, డచ్చి వారికినీ కన్నెఱ్ఱ కావలసి వచ్చు నని కూడ ఎఱుగు నతడు! ముందు ముక్కోటి వంగీయులను తన కుపయోగ పడగల మృగములుగా సిద్ధ పఱచుకొని కానీ ఆ 'సర్కస్' కు యత్నించ బోడు.

మహర్: ఏమో. రాజతంత్రజ్ఞులు, తమకు తెలియ వలయును. మాకు తెలిసినది మనవిచేసి, వెళ్ళుట మా విధి. శెలవు.

యో: మంచిది. తిరిగి మీ విధి నిర్వహణమున మీ రుందుడు. పూనా కీ వార్తమానమును నేను చేర్చెదను.

మహర్, ధనాజీ నమస్కరించి, శెలవు దీసికొని, వెళ్ళిపోయి రా రాత్రికి రాత్రియే ... తమ్ము వెతుకు కొనుచు వచ్చిన గుఱ్ఱముల నారోహించి.

# క్షుద్ర కూటమి

మే 1765అది ,భారతదేశములో తానుచేసిన ఘనకార్య ములకు దేశసామాన్యముచే భూషింపబడి, ప్రభుపదముతో సత్క రింపబడి, రాబర్టు క్లైవు తిఱిగి మఱికొన్ని ఘనకార్యము లను జేయుటకై పంపబడి, ఓడదిగినాడు. ఆంగ్లజాతికి అంతరాత్మ యన దగిన ఎడ్మండ్ బర్కు మహాశయుని వంటివారు భారతదేశ మం దతడు అవలంబించిన అవినీతిని, కుటిలనీతిని ఖండించి పరాకుతెల్పియుండవచ్చును. కాని అమెరికాలో కాలు జాఱిపోవు చున్న దనుఆతురతతో, ఇక్కడ నొక క్రొత్త పట్టు దొఱికించు కొందమను ఆశతో రాజును, రాజకీయవేత్తలును, వర్తకభాగస్వా ములును, కలిసి అతని కేవేవియో బోధించి, పంపినట్లున్నారు.

ఆంగ్లజాతికి ప్రాతినిధ్యము వహించు వ్యక్తులు లంచ గొండ్లుగా, దొంగ వ్యాపారులుగా, దోపిడిగాండ్రుగా, మోస గాండ్రుగా, అబద్ధులుగా, దురాక్రమపరులుగా, మానవద్రోహులుగా వర్తించినచో నది వారికే గాక వారిజాతికే తలవంపులని అంత రాత్మలు కాకున్న పీఠాధిపతులైన చెప్పలేదా? చెప్పియుందురు. కాని దుష్టులు గాక రాజకీయ వేత్తలు గారను జాన్సన్ సూక్తి, నీచులుగాక సామ్రాజ్యవాదులు గారను నొక (ఆంగ్లేయుడేయగు) ప్రథమ స్వాతంత్ర్య ప్రవక్త సూక్తి కలవుకదా?

తత్కాలాంగ్లనేత స్పెన్సర్ కలకత్తాలోని తన మంత్రాం గముతో, అధికార వర్గముతో, వర్తక సంఘముతో, నెదుఱిరిగి, స్వాగతమునొసగి, తెచ్చినాడు క్లైవు ప్రభువును. పక్షుల వేటలో డేగల వలె, వన్య మృగముల వేటలో జాగిలముల వలె షాఆలమ్,

నాజీముద్దౌలాలును వారివెంట కొంతనడిచిరి. కాని విలియం కోట లోనాడు జఱుగు సన్మాన సభలో వారి నుండుమనిన వారు లేక పోయిరి. అది కేవలము నాత్మీయుల సభ యనుకొని, వారు బైటనే యుండిపోయిరి.

స్పెన్సర్ క్లైవుకు 'టోస్టు' ప్రతిపాదించుచు జాతిపూజ్యా, మహాశయా, నేడిక్కడ కూడిన మేమందఱమును ఏమహనీయుని ఆరోగ్యము నభిలషించి, యీ పానీయ సేవనము చేయుచున్నా మో ఆ మీ గుణగణములనుఁ గూర్చి చెప్పుటకు కోశములోని మాటలుచాలవు. ఇంగ్లాండు రాజునుండి ప్రజాసభ వరకు నంద ఱును మెచ్చి, బిరుదులిచ్చి, మఱల పంపియుండుటలోనే మీరు మనజాతికి ఎంత ఒఱిగించు చున్నదియు విదితము కాగలదు. మఱియు భారత దేశము నందున్న మే మందఱమును మీ రాక కొఱకు మృగశిరాగమనమున కైతప్తకేదారముల భాతి నెదుఱుఁజూచు చున్నా మనుటలో నావంతయు నతిశయోక్తి లేదు. అట్టి మీకు మీ పూర్వ రంగమునకు స్వాగతము.

'విశాలాంగ్ల నిర్మాతా, క్లైవు ప్రభూ, తొల్లి కర్ణాటకమున నెంత గొప్ప సేనానాయకులరని ఋజువుఁ జేసి కొంటిరో తరు వాత బంగాళమున నంతకంటె గొప్ప రాజ్యాంగ వేత్తలుగా ప్రవ ర్తించి యుంటిరి. అట్టి మీకు సుస్వాగతము మీ యథాస్థానము నకు.

'రాజకర్తా, రాబర్ట్ ప్రభూ, వందవాసితో షఠాసుప్రాభ వమును, ప్లాసీ, పాటలీపుత్రములతో దేశీయ పాటవములను తుద ముట్టించి, సువర్ణ భారతమున స్వకీయ సామ్రాజ్య సంస్థా పన గావించి వెళ్ళి, తిరిగి వచ్చు నప్పటికి మీ పథకము చెడనీక

కాపాడకల్గితిమని చెప్పుకొనుటకు జంక వలసిన పనిలేదు. మీ ప్లాసి శిల్పమును (మధ్య కొంత మార్చినను ఇప్పుడు) యథా ప్రకార మప్పగించ గలుగు చున్నామనియు, పాట్నా చిత్రమును మాత్ర మభివృద్ధి రేఖలతో గూడ తిరిగి ఇచ్చు చున్నా మనియు మనవి.

'స్వయం వ్యక్తా, సమ్రాట్కర్తా, ఇప్పుడు మీ ఆరోగ్య భాగ్యము నాశించి, యీ పానీయము నిట్లు త్రాగుచున్నాము. అ చిర కాలములో నే ఢిల్లీ మొగల్ సింహాసనమున తమ్మభిషేకించి షాఆలమ్, నజీముద్దౌలాలతో కలిసి మే మందఱ మిట్టే పరివే ష్టించి యుండగా తిఱిగి మీ ఆరోగ్యము నాశించి, యిట్లే పానీయ సేవనము జేయగల భాగ్యము గలుగుఁ గాకయని కోరుచున్నాను' అని ముగించెను.

'తథాస్తు' అని రందఱు. పానపాత్రల యంచు లొక్క సారి తాకించుకొని, సేవించిరి.

క్లైవు సమాధాన మొసగ వలసి యున్నది. లేచి,'మిత్రు లారా, నా తరువాత నా స్థానము నలంకరించిన నేతలలో రాజకీ య చతురిత యింతగా గొడ్డు వోయి నందుకు చాల చింతించు చున్నాను. క్లైవేదో బావుకొని నాడని, వంగపీఠిపై తామును తల కొక నవాబును దించి, వేరొకని నుంచి, ఏదో బావుకొనుటకే చూచిరి, కాని పరిణామ మాలోచించు కొనలేక పోయిరి.

'ఏలికకు ద్రోహము జేసిఁ, మనకు సహాయముఁ జేసిన మీర్ జాఫర్ను; మన అపకీర్తితోఁ బాటు,మన భాధ్యతా భారము గూడ మోయుచు, అనుభవమును మాత్రము మనలనే పొంద నిచ్చుచు వచ్చిన మీర్ జాఫర్ను; స్వకీయుల యెడ తల నెగుర వేయుచు, మన ముందు వంచుకొని బ్రతుకుఁ బుచ్చు గాడిద

వంటి మీర్‌జాఫర్‌ను ఎందుకు పదచ్యుతుఁ జేసి నట్లు? అవులించిన ప్రేవులు లెక్క పెట్టు మీర్‌ఖాసిమును; తమ దేశమున దేశీయ వర్తకులు పన్నులు కట్టుచు రాజకోశమును బెంచుచుండ విదేశీయవర్తకులూరకపోవుటేల నన్న అల్లావర్దీఖాను, సురాజుద్దౌలాలను బహిరంగముగా సమర్థించు మీర్‌కాసింఖానును; నామ మాత్రపాదుషా షాఅలము, అయోధ్యా నవాబు షుజాఉద్దౌలా ఆది శత్రువుల చారవర్గములోని వాడని మొదటినుండియు మన మందఱ మనుమానించుచునే యున్న కాసింఖానును; నంద కుమారరాయ్ వంటి హిందూయోధులచే మన విప్లవములకు అజ్ఞాతముగా ప్రతివిప్లవముల న్నెచ్చగొట్టించు మీర్‌సాహెబును ఎందుకు తెచ్చిపెట్టు కొనినట్లు?

'ఛీ! పానిపట్టులో మహారాష్ట్రులు దెబ్బతినిన అకాలము మన సామ్రాజ్య స్థాపన కెంత అనుకూలముగా నుండెడిది! చెడ గొట్టినారు అంతరభేదములతో!స్వార్థపరత్వములతో!!ఇంక నయము ఏమూలనో అదృష్టమున్నది. ఉండ బట్టియే మనమింకను ఓడ లెక్కలేదు.

'నంద కుమారరాయిని తొలగించి, రజాఖానును నవాబుకు మంత్రిగావించుట పెద్ద పొరపాటు. ముస్లిం నవాబుకు ముఖ్య మంత్రి హిందువుగానే యున్న మూడవ మనకు మంచిది కాదూ?

'మిత్రులారా, దయఉంచి నా విధానము నర్థముజేసి కొనుఁడు. ఎన్నడో కాలదోషము పట్టిపోయిన 1645 నాటి షాజహాన్ ఆజ్ఞలును, శాహజాదా అనుమతులు జూపి, ఈకాలములో సుంకము లేక స్వేచ్ఛావ్యాపారము చేయలేము. అందుకే మన

పేరుమీద మీర్‌జాఫర్ పుంజుకు కత్తికట్టి, వదలిన దానాడు. మధ్య కొలువితో కొంతకాలము తల గోకు కొంటిమనుకొనుడు! కాని ప్రస్తుతనవాబు కుమ్ముటకూడలేని పసిదూడ యగుట మేలైనది. మూతికి చిక్కము తగిలించినచో చాలును, దేశ సౌభాగ్యములు బితుకుకొనవచ్చును!

'ఇదిఇట్లుండగా, ఢిల్లీదూడ నామమాత్రావశిష్టమై పోవుట అదియు మన యదృష్టమే. గడ్డిదూడను జూపి కూడ పాలు పితుకుకొన వచ్చును. అట్టిచో శల్యావశిష్టమైనను, బొందితో నున్న బాద్‌శాహ్ షాఆలమ్‌దూడ మన కెంతయో ఉపయోగించ గలదు. కోరా, అలహాబాదుజిల్లాలయూరులను అయోధ్యనుండిచీల్చి, పేరు మాత్రముగల వీనికిచ్చి, సత్వ సంపన్నుని గావింతము. ఆయన సంతకమున కింకను భారతదేశమున విలువయున్నది కదా. దానితో ఓఢ్ర, వంగ, విహార ములలో భూమి పన్నులు ప్రోవుచేయు నధికారము పుచ్చుకొందము.

'అప్పుడెట్లుండును? రాజ్యములో శాంతి, భద్రతలు సంరక్షించు భారమును, ప్రజలకు న్యాయము ప్రసాదించవలసిన బాధ్యతయు నవాబునకు మిగులును! కాని నవాబుతో చేసికొనిన ఒడంబడిక ప్రకారము వానిసైన్యము మనస్వాధీనముననుండును. ఇక రాజ్యాదాయము కూడ మన చేతిలోనికి వచ్చినదా, పండులోని రసమంతయు మనవంతు, పైఆకారము నిచ్చు తొక్క మాత్రము వాని వంతు అగును.

'అప్పుడెట్లుండును? ఈ దేశమున మన అధికారమునకు స్థిరత్వము, న్యాయ సమ్మతి ఉండును. సీమలో మన వారికి మనము కన్నెఱ్ఱ కాము, ఇక్కడ పరాసు మొదలగు వారికి

భయము గొల్పము, రసపుత్ర, మహారాష్ట్ర, మొగల్ ఆది దేశీయ పాలకుల కనుమానము గల్గించము.

'ఇంకను ఎట్లుండును?

'అధికారము, అనుభవము మనవి! పాలనాబాధ్యత, రక్షణ భారము నవాబువి గా నుండును. మన సైన్యముల, పౌరుల పోషణమే కాక మనవ్యాపారములో పెట్టుబడికి కూడ ధనము లభించును మనకు.

'మిత్రులారా తొందర కూడదు దేనికిని. పూర్తిగా బెంగాలుకే పాతవారము కాలే దింతవఱకు మనము! పోగలిగినకలకత్తా దాటి, పాట్నా, ఢిల్లీల వఱకు పోగలము! పోయినను? అంతయు క్రొత్త! అంతయు విదేశము! అందఱును విజాతి! అక్కడ నుండి పఱుగెత్తవలసి వచ్చినచో, నేరుగా ఓడ నెక్కనే కావచ్చును.

'మిత్రులారా నావిధానము నర్థముఁ జేసికొనుడు. నాతో సంపూర్ణముగా సహకరించి, మహారాష్ట్రులు పానిపట్టు దెబ్బ నుండి పూర్తిగా పుంజుకొనక ముందే మొగల్‌ల స్థానము దీసికొనునది మన మని ఋజువుచేయుదము' అని కూర్చుండెను స్వాగతసభ ముగిసెను.

తదుపరి తనకు వలసిన మంత్రాంగ సభ్యులను తానే ఎన్నుకొనెను. వారు తప్ప ఇతరు లందఱు వెడలిపోయిరి. మంత్రాలోచనలో దిగిరి. కుట్రాలోచనలోనికి.

మఱునాటినుండియు ఎన్నియో ఇంగ్లీషువిస్కీ, పరాసు వైను, స్పెనిషుబీరు, స్కాచి బ్రాందీలు దిగసాగినవి. యూరపియన్ సురాపవతుల నెందఱినో పిలిపించిరి.